# నేత్రపర్వం

కీ.శే. డా॥ దాశరథి



ప్రచురణలు

హైదరాబాదు

ప్రథమ ప్రచురణ : సెప్టెంబరు, 1988.
ప్రతులు : 500

వెల. రు : 10

ముఖచిత్రం : శ్రీనివాస్

ప్రచురణ మరియు © :
చైతన్య సాహితీ సమాఖ్య.
హైదరాబాదు.

ప్రతులకు :
చైతన్య సాహితీ సమాఖ్య.
6-1-137/C/2/3, పద్మారావునగర్,
సికింద్రాబాదు 500 025

ముద్రణ :
మాస్టర్ ప్రింటర్స్
1 - 4 - 905/4/B
మేడమీద, బాకారం, ముషీరాబాద్
హైదరాబాద్ 500 048



కీ. శే. డా॥ దాశరథి

జననం : 22-7-1927

మరణం : 5-11-1987

## మామాట…

1983లో ఆవిర్భవించిన మా చైతన్య సాహితీ సమాఖ్య నిక్కచ్చిగా నిజమైనటువంటి కొందరు సాహితీ పరుల, సాహితీ ప్రియుల మరియు పోషకుల సమాఖ్య. వారి కుసుమ కోమల పేశల హృదయ ధామమునుండి సమకూర్చిన మధు మంజూషమే మా చైతన్య సాహితీ కవితా ప్రచురణ స్రవంతి.

యిప్పటి వరకు ఈ క్రింద వివరించిన ఏడు పుస్తకాలను ప్రచురించ గలిగాము.

1. గురజాడ దేవులపల్లి సాహితీ సమారాధన
2. చందనాగ్ని
3. Dream or Reality
4. గులాబీలు
5. Writer and Freedom Fighter Premchand
6. ఆక్రోషణ్ కే హంసతీన్
7. అక్షర దీపం

కీ. శే. డా॥ దాశరథిగారి ఈ 'నేత్రపర్వం' మా ఎనిమిదవ ప్రచురణ.

నూనూగు మీసాలు మొలిచీ మొలవకముందే ఉద్యమాలే ఊపిరిగా తెలుగు నాటి ప్రజలే ప్రాణంగా పెరిగి నిరంకుశ నిజాం నవాబుపాలనపై తిరగబడి అనేక సంవత్సరాలు జైలు జీవితం గడిపినా నిరాశకు తావివ్వని ధీశాలి, పరిపూర్ణ మానవతావాది కళాప్రపూర్ణ దాశరథి. ఇరువది రెండు సంవత్సరాల వయస్సులోనే బూజెక్కిన బూర్జువా విధానానికి మార్పు తప్పదని తీర్మానించి, "అగ్నిధారను" పుక్కిటపట్టి, "రుద్రవీణ"ను మీటి, "మహాంధ్రో

దయం" కోసం పెన్నే గన్నుగా ప్రత్యక్షరం తుపాకి గుండుగా సమరం సాగించిన కవితాయోధుడు డా॥ దాశరథి.

"పోవాలి కృత్రిమాల చీకటి
అప్పుడు వెలుగుతుంది మనః కుటి
రావాలి మన నరనరాల్లోకి జవం
అప్పుడర్థమౌతుంది పునర్నవం"

అంటూ కృత్రిమాల చీకటిపై కవితా కిరణాస్త్రాలను సంధించిన లౌక్యమెరుగని ఏకలవ్యుడు డా॥ దాశరథి.

అశేష ఆంధ్రులకు అభిమాన పాత్రుడూ, అగణిత భావనా పరంపర కుసుమధామా వనమాలీ, నవయువ కవితా తురంగ రథసారథి డా॥ దాశరథి.

ఇటీవలి కాలంలో వివిధ దిన, వార పత్రికల్లో ప్రచురితమైన వారి కావ్య ఖండికలను ఏర్చికూర్చి "నేత్రపర్వం" అనే పేరిట ప్రచురించాలని డా॥ దాశరథి గారు అనుకునేవారు. 5-11-1987న దివంగతులగుటచే 'నేత్రపర్వం' మా చైతన్య సాహితీ సమాఖ్య తరపున ప్రచురించి ఆ కీర్తిశేషునికి కవితా నీరాజనం అర్పించాలనే కోరికయే ఈ పుస్తక ప్రచురణకు నాంది.

ఈ కార్యక్రమానికి ఆర్థికంగా తోడ్పడిన శ్రీ. పి. దామోదరరావు మరియు కీ॥ శే॥ పి. హన్మంతరావుగారి కుమారుడు శ్రీ పి. రాంమోహనరావు గార్లకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

కవరు పేజీ చిత్రించిన శ్రీ. శ్రీనివాసుకు, సహకరించిన మిత్రులకు మా కృతజ్ఞతలు.

ప్రకాశకులు

# నేత్రపర్వాలు

# తెలుగు రుబాయిలు

నా మనసున నా సరసన ప్రేమ ఉన్నది
అందరాని దూరంలో ఆమె ఉన్నది
ఆమె ఉన్న ప్రదేశాలకంతే లేదా ?
పద పదమున చెలియ నాట్యసీమ ఉన్నది

తిరుగుతోంది రేయింబవలు భూమిబొంగరం
నేలకొరకు నరుడు చేయసాగె సంగరం
నిరాధారముగ తిరిగే ఈ భూగోళం
ఎవరి వ్రేలినుండి జారిపడిన ఉంగరం ?

గడ్డిమోసు కొనలో గల జలకణము
విలువ ఎంత ? అనిన చెప్పలేము మనము
రత్నాలకు ముత్యాలకు ధరలున్నాయి
అశ్రువులను కొనడానికి లేదులేదు ధనము.

కవిత వ్రాసినపుడే అది కలమవుతుంది
పాటపాడినపుడే అది గళమవుతుంది
బలాఢ్యులను చిత్తు చిత్తుగా ఓడించి
దుర్బలులను ఆదుకుంటే, బలమవుతుంది

నీలి నింగిలోన గలవు కోటి తారలు
వెండి తెరలపైన గలరు నేటి తారలు
జాతకాలు మారుతాయి తారలతో !
తారాబల మెదిరించే వారె ధీరులు

అధరాలలో ఎన్ని మధు పాత్రలో ?
ప్రియురాలితో ఎన్ని రసయాత్రలో ?
మూసేసి వెళిపోండి మధుశాలలు
కవితా సుధాపాన నవరాత్రిలో

గుడిని మృత్యుమందిరముగ మార్చారు
మారణాస్త్రములు గుడిలో పేర్చారు
ప్రశాంత దేవాలయ పరిసరాలలో
రణరంగమునే దిద్ది తీర్చారు

ప్రతివారికి కావాలి రూపాయీలు
మరి ఎవ్వరు మెచ్చుతారు రుబాయీలు ?
రసలుబ్ధులు లేకపోరు ఈ లోకంలో
వారి మన్ననలు నాకు కోటి తురాయీలు !

కనురెప్పల కన్నీళ్లు తళతళలాడె
గుండెలలో గాయాలు గుమగుమలాడె
శరధీ ! ఈ నందనవన సీమలలోన
సురతరు సుమములు ననుగని కొరకొరలాడె.

అందాల గగనంలో తారావళి
అవి పాడును తేజోమయ గీతావళి;
ఏడాదికి ఈ భువిలో ఒకసారే అయినా
ప్రతి రేయీ ఆ దివిలో దీపావళి

నీ వీథికి రావలదని నిషేధమాయె
అడుగడుగున నా దారిని నిరోధమాయె
గాలి తరగనై నే నీ వాకిటిగుండా వెళితే
అది తెలిసిన నీ వారికి విరోధమాయె

పరబ్రహ్మ చెక్కినాడు అందాల బొమ్మను
సురలోకాంగనల కళ్ళు కుట్టించే కొమ్మను;
కవితా సుస్నేహమొసగి కాపాడుకుంటాను
సౌందర్య జ్వాలలతో వెలిగే ఈ సెమ్మెను

భారతదేశం ఒకటని పలికేవారు
దేశంకోసం రక్తం వొలికేవారు
జాతికొఱకు ప్రాణాలను బలిగావించే
త్యాగధనులు పదవులకు పనికేరారు !

భాగ్యనగరి చుట్టు పట్ల బందిపోట్లు
అడపా తడపా తప్పవు కత్తిపోట్లు
ప్రశాంతంగా జీవించే భాగ్యంలేదా ?
గూండాలకు కావాలి పచ్చనోట్లు

గోలకొండఖిల్లాలో బందిఖానా
రామదాసు మ్రగ్గినాడు అందులోన
మంచిపనులు చేసినపుడు శిక్షిస్తారు
మనుషుల చంపేవారికి ఖానా, పీనా !

తమలపాకునై పెదవిని తాకినవేళ
పైట చెంగునై బుజాన్ని ప్రాకినవేళ
గుర్తించావో లేదో లైలా! నన్ను!
ఖడ్గనై నీ పెదవులపై దూకినవేళ

పోతబస్తి తీసింది కవి ప్రాణాలు
నడివీధిని పడిపోయెను ధన, మానాలు
అరచేతను వైకుంఠం కనిపించేలా
ప్రభువులు చేస్తుంటారు వాగ్దానాలు

క్షణంవెలిగి పడిపోవును నేలమీద ఉల్క
ఇందుకు జోస్యం ఎందుకు చెప్పాలి చిల్క ?
చెప్పు దెబ్బలన్ని తలకు తగిలేలాగా
తానువాగి నోటిలోన దాగును నాల్క !

సముద్రాన రథం నడుపు సాహసాలు వద్దులే
నేలమీద నావ నడుపు లీలలన్ని రద్దులే
ప్రకృతి విరుద్ధపు పనులకు పూనుకొనుట దేనికి ?
మనసిచ్చిన మగువతోటి మనువాడుటె ముద్దులే !

జనగణముల పాలించే గణపతివా ? కావు
ఉండ్రాళ్ళను మెక్కి మెక్కి బొజ్జ పెంచినావు;
ప్రజాస్వామ్యమని ఊరక వల్లిస్తే చాలదు
ధనస్వామివై నావు, ధనం వదలలేవు

నీ మనసే నీ చక్కని అద్దం
నీ వలపే నీ మాయని అందం
కనిపించని ఆ మన్మథుడే
కల్పించాడు మన కీ బంధం

మండుటెండారికి ఎందుకు మధ్యాహ్నం వచ్చావు
గుండె గుడారం ఇదిగో! గొడుగెందుకు తెచ్చావు
నయనసరసిలో నీవు ఈదులాడు కోసమై
చాలిన పన్నీరుండగ అత్తరేల మెచ్చావు ?

పైవానికి కానరాని ప్రదేశాలు లేవు
తప్పుచేయుటకు ఎందుకు తలుపులు మూస్తావు
పిల్లి కళ్ళు మూసుకుని పాలు తాగినట్లేరా !
అంతర్నేత్రం కాంచని వృంత లుండబోవు.

రాళ్లు పూస్తున్నాయి
కళ్ళు వ్రాస్తున్నాయి
కవితామయ ప్రణయలేఖలు:
కలాలకు పనిలేకుండా చేస్తున్నాయి !

కుసుమ ఝుంఝు వీస్తున్నది
వసంతసేన వస్తున్నది !
ఎండిన మోడులలో సైతం
గుండెలనిండా చైతన్యం కనిపిస్తున్నది.

కురులలోన ఉన్నది కుసుమ కదంబం
వెనుకవైపు ఉన్నది విరళ నితంబం
ఆత్మీయుడు అనంగుడే నా తోడుంటే
నీ ఎదలో నాటగలను విజయస్తంభం

మదించిన కుంజరంలా
మధుమాసం; కాంచన పంజరంలా
ఈ లోకం — దర్శనీయంగా వుంది
మ్రోగుతున్న నృత్యాంగన మంజీరంలా

వద్దంటే కురుస్తున్నాయి పూలవానలు
ప్రవహిస్తున్నాయి వలపుతేనె సోనలు
ప్రియులకోసం ముస్తాబైన ప్రేయసీ మణుల్లా
అలంకృత తరులతామయములు అడవి కోనలు

లాటరీలో గెలిచినవారి గేహంలా
చిరకాలం పిమ్మట కలిసిన దోస్తుల స్నేహంలా
ఆనందోల్లాస భరిత మీ ప్రపంచం
మొదటిరేయి వధూవరుల మోహంలా

దుఃఖ భాజనమైన ఈ లోకంలో
అనంత దరిద్ర జనావళీ శోకంలో
సుఖశాంతులకు సంకేతం వసంతం
నరులపాలిటి భూలోక నరకంలో

చెలియ పలుకు పలికిందా ? ఇంకెందుకు వీణలు
ఆమెముందు బలాదూరు సురలోకపు జాణలు;
విరబూసిన గుల్ మొహరు తరువులాంటి మామూఖా
రమ్మన్నది; వెళతా; నన్నాపలేవు జడివానలు

వకుళ కుసుమ వజ్రాయుధంతో
రమణీయ మలయానిల రథంలో
బండల్లాంటి గుండెల్ని బద్దలుకొడతాను
పయనిస్తాను ప్రశాంత వాసంత పథంలో

మహిమండలి నిండా మామిడి పిందెలు
ప్రతి ఇంటి ముంగిట పానకం బిందెలు !
విశ్రుత విహారంచేస్తున్న మదన సైన్యంతో
మనోహరంగా వున్నాయి మలుసందెలు

సుద్దులతో భ్రమపెట్టే పెద్దలెందుకు ?
కత్తులతో నిర్మించే గద్దె లెందుకు ?
తెల్లదొరల విధానాలనే అనుసరించే
మనో వికాసం కలిగించలేని విద్దెలెందుకు ?

ఉగాది రాకతో జగమంతా మారుతుంది
వసంతాగమనంతో వసుధ అంతా మారుతుంది
ఎన్ని మారినా, యెంత పుష్పవర్షం కురిసినా
ఎప్పుడు మానవ పాషాణ హృదయం మారుతుంది ?

దాడిమీ బీజారుణ దరహసితాధరము
ధరణీధర శిఖరాయిత పరమోన్నతమురము
నన్ను తాకి నరనరాల పులకింతల పొంగించే
అంగన కోమల కరము అతి మంగళకరము

వాల్మీకియె లేకుండిన శ్రీరాముడు యెక్కడ ?
వ్యాసుడు లేకున్న ఘన శ్యాముడు యెక్కడ ?
పెద్దనాది మహాకవులు లేకుండినచో
కృష్ణదేవరాయ సార్వభౌముడు యెక్కడ ?

అహంకారమున మనిషి ఏనుగై పోతాడు
పిరికితనం వలన మనిషి పీనుగై పోతాడు
తలచుకున్న దాని కొరకు తల్లడ పడిపోతూ
తనచుట్టే తాను తిరుగు గానుగై పోతాడు

గద్దెమీద యెక్కగానె కోతలు వేరు
గద్దెనుంచి దిగిన పిదప కూతలు వేరు
రాజకీయ నాయకుడు యెంతగా మారాడో ?
నోటి మాట లోక తీరు, చేతలు వేరు.

దురాశతో పొంగిపోవ తగదని తెలుసు
నిరాశపడి క్రుంగిపోవ వలదని తెలుసు
అన్నీ తెలిసీ కూడా ఈ మానవ మాత్రునికి
మాయను విడనాడ వీలు పడదని తెలుసు

వెల్కొలాన ఉరోజాలు బంధించేవు
క్రీగంటను బాణాలను సంధించేవు
ఒడిపోయి లొంగిపోదు ననుకున్నావా ?
నా గెలుపును చూచి నన్ను నిందించేవు

పాడులోకమును చూసి భయపడతావెందుకు ?
పగవాడిని నీ వాడని పొరపడతా వెందుకు ?
రాళ్ళు పూలుగా మారే రమ్యవసంతోత్సవము
వస్తున్నది; అంతలోనే త్వరపడతా వెందుకు ?

మషీపాత్ర వలె గగనం మారినగానీ
మషీపంకమై సంద్రం పొంగినగానీ
వనిత జగన్మోహన స్వరూప వర్ణనచేయు
సాగరాల సిరాకూడ చాలకపోనీ

బీడీగాని, పేడాగాని నోటపెట్టుకుంటారు
తమదైనా పరులదైన చేత పట్టుకుంటారు
పిల్లవాళ్ళ కంటెగూడ పిల్లలైరి పెద్దవాళ్ళు
ఏది దొరికితే దాన్నే నోట పెట్టుకుంటారు !

ప్రతివాడూ పాట పాడి వినిపిస్తాడు
ఘంటసాలనే మించెనో అనిపిస్తాడు
నా కళ్ళకు చత్వారం వచ్చిందేమో !
ప్రతి 'లుచ్ఛా' 'అచ్ఛా'గా అనిపిస్తాడు !

నీ నిందను స్తుతిగానే భావిస్తాను
నిరాశలను పారద్రోలి జీవిస్తాను
అలకతోటి అతిదూరం పోయేదానా !
ఒక త్రుటిలో నిన్ను నేను సాధిస్తాను

వలపుకాండ్రు తోటలోకి వస్తుంటారు
పొదలలోన ఏమేమో చేస్తుంటారు
నేను ఒక్కపువ్వు కోసుకున్నానంటే
మాలీలు నా మీద ఏడుస్తుంటారు

డబ్బు కట్టనిది వెలగదు విద్యుద్దీపం
బిల్లు పెరిగి పోతే గృహస్తుకు కోపం
ఉచితంగా సూరీడు వెలుగు ప్రసాదిస్తుంటే
అతని కెవరు థాంక్స్ చెప్పరయ్యో పాపం !

సూర్య నమస్కారాలు మీరు చేస్తున్నారా ?
ఆర్యుల మాటలను పాటిస్తున్నారు ?
లోక బాంధవుడు లేనిది లోకం లేదు
రవి శక్తిని సద్వినియోగం చేస్తున్నారా ?

తెర మీద బొమ్మ ఎంత సేపుంటుంది ?
రోడ్డు మీద 'కొమ్మ' ఎంత సేపుంటుంది ?
కింద పునాదులు లేక పైపైన కనిపించే
పేక మేడ గూడ ఎంత సేపుంటుంది ?

దోసిటిలో నీళ్ళవంటి నీ యౌవనము
దాచి దాచి ఉంచాలని ఏల జతనము ?
దప్పిగొన్న నన్నువంటి బాటసారి కివ్వ
సార్థకమవుతుంది చెలీ ! నీ జీవనము !

అందని తారలు గగనంలో ఉంటాయి
అందే తారలు నగరంలో ఉంటాయి
వెండి తెరలపై తారను వంగి వంగి చూస్తుంటే
ఊహలలో ఏవో కనిపిస్తుంటాయి !

ఉల్లిపాయలో ఉన్నది కన్నీరే !
మల్లెపువ్వులో ఉన్నది పన్నీరే;
తీపి నీళ్ళ మహా నదులు తనలో దాచే
సాగరాన కలదంతా ఉప్పునీరే

శక్తివంతులేమో తమ శత్రువులను నరుకుతారు
పిరికివాళ్ళు మాత్రం తమ మిత్రులనే నరుకుతారు
మొక్కనాటి చెట్టులాగ పెంచలేరు గానీ
ఎదిరించగ లేని తరువులనే నరుకుతారు.

ఆకలి గొనువాడి కేల కర్పూర వీటికలు ?
స్వప్నంలో వృథాకదా శృంగార చేటికలు ?
పంజరాన ఉంచుతాడు వేటకాడు
పక్షికి చూపిస్తాడు వనవాటికలు !

కవితలతో కవ్వించే కళ్ళే చాలు
గజ్జెలతో మురిపించే కాళ్ళే చాలు
విప్పరాని కడు చిక్కు సమస్యల్లాగా
చెలి నడుమున చీర పొంకముళ్ళే చాలు !

ఎండవేడి తట్టుకోదు కోమల తనువు
చలిగాలిని ఓర్వలేదు చంచల తనువు
కుసుమం వలె సుకుమారంగా ఉంటుంది
తుదకు కాటి మంట పాలు, మానవ తనువు !

ప్రపంచాన ప్రతి 'అణువు' భయపెడుతుంది
కాలంలో ప్రతి ఘడియ భయ పెడుతుంది
దూరంగా చూచినపుడు అందాలరాణి
చెంత చేర, కాళివోలె భయపెడుతుంది !

తనువు సౌఖ్యపడుట కొరకు మనసు అమ్మకు
ప్రాణంకోసం నీవు మాన మమ్మకు
కొనేవాడు అమాయకుడు అయినా గానీ
అసిలీ అని చెప్పి నకిలీ సరుకు అమ్మకు

నిన్నటి ఏనుగులన్నీ నేడేమో పీనుగులు
నిన్నటి పెనురథములన్ని నేడేమో గానుగలు
చలనచిత్ర పౌరాణిక రంగస్థలిపై
గాండ్రింపులు నేడైనవి మూలుగులు

విరులకు పరిమళ మొసగే కురులున్నాయి
శిలలకు గిలిగింతలిడే మరులున్నాయి
మదనబాణమే చెలియై మదిని నాటినపుడు
ఎదగదిలో గాయాల సిరులున్నాయి

తోటలన్ని ఎడారులై కనిపించాయి
పాటలన్ని పెడబొబ్బలు అనిపించాయి
ఎడారినే ఇసుకతోట అంటున్నామా ?
మారిన సిద్ధాంతాలే వినిపించాయి

పాపం వెంటనే దాని పరిష్కారం ఉంది
శాపం వెంటనే ఉపసంహారం ఉంది
చెద తినడానికి భయపడుతున్నా డెవడు ?
ఆధునికౌషధ భాండాగారం వుంది !

అభినందన - సమక్షాన చేస్తుంటారు
అభిశంసన - పరోక్షాన రాస్తుంటారు
పదవులన్ని తమకే మరి కావాలాయె
పదవి మరొకడి కొస్తే ఏడుస్తుంటారు !

ఎంతో పకడ్బందీగా జీవిస్తారు
ఎల్లకాల ముంటామని భావిస్తారు
ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు, ఏ రూపంలో
మృతి వచ్చునో తెలియక మరణిస్తుంటారు

నయన శయన మందిరమున నన్ను నిదురపోనివ్వు
అధర పానశాలలోన మధువు గ్రోల రానివ్వు
చిరిగిన నా చొక్కాలో చెదరిన హృదయం ఉంది
గుండె బలము కొరకు నీవు కొంచెముగా నవ్వు

మునుగువేసి మునిలాగా కూర్చున్నాడు
సాక్షాత్ దేవునిలాగా కూర్చున్నాడు
ఆకారంలో దైవం, గుణమున దెయ్యం!
జింకరూపు తోడేలై కూర్చున్నాడు

కప్పను చంపే పాముకు గర్వము తెలుసు
పాముగూర్చి గరుడునికి సర్వము తెలుసు
గరుడునిపై వేంచేసిన విష్ణుమూర్తికి
మహా మహీ మండలాల మర్మము తెలుసు

కురులను విరబోయగానె ఇరులు క్రమ్మెను
తిలకమ్మును దిద్దగానె వెలుగు చిమ్మెను
రేయిగాని పగలుగానిచెలీ! నీ వలన
మారుచుండుననుటను నా మనసు నమ్మెను

యెన్నెన్ని మతాలకైన సూత్రం ఒకటే
పాత్రలెన్ని కనపడినా చిత్రం ఒకటే
ఒక చెట్టుకుయెన్నెన్నో కొమ్మలు వున్నా
అన్నిటికీ తరుమూలం మాత్రం ఒకటే

నటనైనా నిజమైనా ప్రేమించు చెలీ!
ఇంటగాని, బైటగాని కనిపించు, చెలీ !
రాగాలెన్నో విని విని విసిగిపోయి వున్నాను
'అనురాగం' నా మదిలో వినిపించు, చెలీ !

హంతలకు నియంతలకు అంతా భయపడతారు
మనీషులకు, మహాత్ములకు యెవ్వరు భయపడతారు?
కర్రలేని వాడైతే గొర్రెకూడ కరుస్తుంది
సాధువులను సజ్జనులను అంతా భయపెడతారు

అన్యాయం, న్యాయమనగ, వినుకోవాలా ?
గర్జనలకు కిమ్మనక ఊరుకోవాలా ?
రెక్కలు కత్తెరచేసి చిలుకను వదిలేశాడు
వేటగాడు దయామయుడు అనుకోవాలా?

ఆమె పెదవి, మోము, పుట్టుమచ్చయె చాలు
యెందుకు తేనియ, చంద్రుడు, చీకటిరేయి ?
నా కొఱకే అమర్చాడు సృష్టికర్త నా చెలికి
వెనుకవైపు భారాలు ! ముందువైపు గోళాలు !

తినకూడని తిండ్లన్నీ తింటుంటారు
కనగూడని పిల్లలను కంటుంటారు
ప్రజాస్వామ్యమందు విశ్వసించని వారే
ప్రజాస్వామ్య మంతరించె నంటుంటారు !

మధుశాలలో మధువే లేకున్ననాడు
న్యాయశాలనుండి న్యాయం రాకున్ననాడు
జీవించి ఎందుకు ఈ లోకంలో ?
ప్రియురాలిలో ప్రేమ దొరకకున్ననాడు.

మినుకు మినుకుమంటూ మెరుస్తుంటావు
మునిమాపువేళ అవతరిస్తుంటావు
గాఢాంధకార బంధుర నీలనిశా వేళల్లో
కాంతి బిందువులను కురుస్తుంటావు

ఎన్నికోట్ల వెలుతురుమైళ్ళ దూరాన వున్నావో !
ఎన్నడైన భూలోక కవితలు విన్నావో ?
చంద్రునిలో ప్రాణం లేదన్నారు విజ్ఞానులు ?
మరి నీలోనూ ప్రాణం లేదనుకుంటే నవ్వుకున్నావో ?

ప్రాణులెన్ని రకాలో భూగోళంలో చూశాము
వాటిని గురించి రకరకాలుగా వ్రాశాము
పశుపక్ష్యాదుల ప్రణయ లీలల్ని గురించి అరణ్యాల్లో
పర్యటించి ఎంతెంతో అధ్యయనం చేశాము

నీవు భూదేవికంటే పెద్దదానివా ? చిన్నదానివా ?
నీలో అసంఖ్యాక ప్రాణి సందోహం వున్నదానివా ?
బాధా గాథామయ ప్రపంచంలా నీవున్నూ
ప్రణయ ప్రళయాల ద్వంద్వం చవిగొన్నదానివా ?

తోటలోకి నీవు వచ్చి నిలిచిన వేళ
పూలవైపు చూచునెవడు? ఓ ప్రియురాలా!
దశాబ్దాలు వాడిపోని నీ నగుమోము
పోల్చుటకే కుసుమమైన సరిపోదేలా?

రంభా స్తంభాలను అనుకుని నుంచున్న సరసులు
ఊర్వశి ఊరువులను గాయపరిచే విరసులు
చీకటి వెలుగుల దాగుడుమూతలతో
వున్నారా నీలో వ్యామోహ వివశులు?

ఒకరికోసం ఒకరు పరితపిస్తున్నవారు
సంయోగ యోగం లేక సదా విలపిస్తున్నవారు
కామ, ప్రేమల మధ్య గీటు గీయలేక
కకావికలౌతున్న తత్వవేత్తలున్నారా నీలో - గొప్పవారు?

ఏ వ్యోమ నౌక నన్ను నీ వద్దకు చేరుస్తుంది?
ఏ మహాశక్తి మనని సన్నిహితం చేస్తుంది?
గిరగిరా తిరిగే భూమి బొంగరంపై తిరుగుతున్నాను
ఈ ఆత్మ ప్రదక్షిణం ఎప్పటికి ముగుస్తుంది?

మా సౌరకుటుంబంలో ఒకరితో ఒకరికి పరిచయం తక్కువ
అన్నీ తెలుసుననే అహంకారం మాత్రం మాలో ఎక్కువ!
అఖండ బ్రహ్మాండంలో యెన్ని కోటానుకోట్ల తారలో కదా!
అన్నిటికంటే దూరాన మెరిసే నీవంటే నాకు మక్కువ!

ఇంటి తలుపు మూసినపుడు నాకేమేలు
ఇంటి తలుపు తెరచి వుంచు; అంతేచాలు
కిటికీ బయటకు జారిన నీ పయ్యెదతో
నీ గదిలో చేరుకొందు, గడుపుదురేలు

పువ్వుతోటి వజ్రమైన తెగిపోతుంది
పాటతోటి శిలయైన కరిగిపోతుంది
'శరథి' వ్రాయు నవ్యకవిత కత్తి కాదుగా ?
మరి ఎందుకొరకు గుండెలోకి దిగిపోతుంది ?

# దీప దీధితులు

కులసతి ఫాల భాగమున
　　కుల్కెడి కుంకుమ బొట్టువోలె వె
ల్గులు వెదజల్లు దీపికల
　　కున్ ప్రణమిల్లి మహాంధకార సం
కుల హృదయాటవీ భయద
　　కోణములన్ చిరు దివ్వె వెల్గు రే
కల ప్రసరింప జేయుటకు
　　గా పయనింతు నమాస వేళలన్
జ్ఞాన జ్యోతులతో హిమాలయ శిఖా
　　సందోహ మొప్పార వి
శ్వానన్ కాంతులు జిమ్మ భారత భువిన్
　　ధ్వాంతమ్మెలా నేడు ? దే
శానన్ చిక్కులు ! క్రూర దుర్జన రిరం
　　సాకాంక్ష హెచ్చెన్ ప్రజా
సేనా వారములార ! లెండు ! భరత
　　శ్రీరక్ష గావింపగన్
అంధకార అహంకార సింధురమ్ము;
త్రైజసాంకుశముల తోడ తరలిరండు
భరత జాతిని విచ్ఛిన్న పరచ జూచు
శాత్రవుల గుండెలను చెండు సమయ మిద్ది

# దేశం ఆదేశం

గారుడ పక్షాంచలాలను తాకుతూ
గగన పథాల ఎగిరే సావర్గ కేతనాచ్ఛాయల్లో
ఇన్ని కోట్ల జనావళి ఏకంగా జీవించాలని
పెద్దలు కన్న కలలను కల్లలు చేయ
వద్దు వద్దంటున్నాయి ముద్దుల నక్షత్రాలు

ఈ దేశం సహస్రాబ్దాల తరువాత
ఇలా ఏకసూత్ర సంబద్ధమయింది
ఆ ఏకసూత్రాన్ని ఛేదించాలని
అనేకంగా కుట్రలు పన్నే ద్రోహుల్ని
అదుపులో పెట్టమని బోధిస్తున్నాయి
అరణ్యాల్లో విరబూసిన కుసుమాలు

ప్రజాస్వామ్యాన్ని మంట కలపాలని
ప్రతిన బూని కూర్చున్న ప్రజాశత్రువుల్ని
ఓడించడానికి ఒక్కుమ్మడిగా లేవండి
ఉదధివలె ఉప్పొంగి విజృంభించండి
సంవిధానం సాక్షిగా సాగండి
అంటున్నాయి నదీ నద తరంగాలు

మానవులవలె పైకి కనిపించే
దానవులను కనిపెట్టండి



దాశరథి

సాటి మానవుల ప్రాణాలతో
చెలగాటమాడె రక్కసుల
ఆటలు సాగనివ్వకండి
అంటున్నాయి గిరి శిఖరాలు

మనని మోస్తున్న మన కన్న తల్లి
మాతృభూమి ఉద్ఘోషిస్తున్నది
"బిడ్డలారా! తప్పుదారి పట్టకండి
స్వేచ్ఛను అపహరించజూచే శత్రువుల్ని
శిక్షించకుండా విడిచిపెట్టకండి
భయంకరాంధకార గుహా మధ్యంలో
ప్రభాత ప్రభలు ప్రవేశపెట్టండి
సమర రుజాగ్రస్త లోకానికి
శాంత్యౌషధం అందించండి
దేశం ఆదేశం వినలేనివాడు
దేశీయులకు బొత్తిగా పనికిరాడు
స్వాతంత్ర్యంకోసం బలియైన ఆత్మలు
సర్వదా జాతికి శ్రీరామరక్షలు.

# ఇల్లిల్లు - హరివిల్లు

ఆకాశంలోకి అలా అలా వెళ్ళి
అంబుదాల అంచుల్లో తుళ్ళి తుళ్ళి
హరివిల్లును తుంచి తెచ్చారా
అందాల పాపలు మనసారా ?

లాల్‌ఖిల్లా మీద ఎగిరినా
లక్షద్వీపాల్లో ఎగిరినా

తలఎత్తి నిలుచున్న భారతమాతకు
తరతరాల బానిసతనం వదల్చుకున్న జాతికి
పసందైన ఈ హరివిల్లు ముక్క
ఫాలభాగాన మువ్వన్నెల చుక్క

సైనికుడి చేతిలో
సైరికుడి చేతిలో
కార్మికుడి కరములో
అంతటా ఒకే పతాకం
అందుకే అఖిల భారతం ఏకం

స్వతంత్ర పతాక ఎగరడానికి ప్రాణాలు
సంతర్పణ చేసిన స్వాతంత్ర్యయోధ గణాలు

ఆకాశంలోనుంచి పరిశుద్ధాత్మలై
అందరినీ దీవిస్తున్నారు
వారెరుగరు మరణాలు

త్యాగరాగంతో అద్దిన ఈ పతాకను
తరతరాలు ఎగరవేయడానికి
ఐకమత్య బలం కావాలి
అన్యోన్యతగల జనం కావాలి
కలహానికి కాలుదువ్వే వాడికి
మన అంతఃకలహాలకు నవ్వేవాడికి
బుద్ధిచెప్పడానికి జెండాలు చేబూని
సిద్ధంగా ఉండండి కలతలు మాని
ఈ స్వాతంత్ర్యమాస పూర్ణిమాశుభవేళ
ఆసేతు హిమవన్నగానికి ఆనందహేల
కవుల కలం స్వతంత్రం
కర్షకుల హలం స్వతంత్రం;
స్వతంత్రం పునాదులమీద
సౌధంలా నిలుస్తున్నది ప్రజాతంత్రం
భారతాత్మ పవిత్రం కావడానికి
ఇదే పంచాక్షరీ మంత్రం;
నా మాతృదేశ మృత్తికా సుగంధం
నా ఊపిరులు పఠించే మహాగ్రంథం
సర్వస్వతంత్రవైజయంతిక పైకెత్తండి
ప్రజాస్వామ్య సామ్యవాద శంఖమొత్తండి
ఆ శంఖానాదం
నా నవ్యవేదం.

# ప్రణయోన్మాదులు

పుచ్చపువ్వులా వెన్నెల విరిసింది
పిచ్చివాడి కేక వీధిలో వినిపించింది
చిల్మన్ తొలగించి ఒక సఖి చూసింది
చెలి తన విరహం తనలో దాచింది
తనవల్ల ఆతని హృదయం గాయపడింది
ప్రణయోన్మాదంతో మనసు చెడింది
ముత్యాల అంగడిలో అతన్ని చూసింది
ముద్దుగా అతనికో కవితాలేఖ వ్రాసింది
ఇంటికి వచ్చిన ఆతనికి లాఠీదెబ్బ తగిలింది
తన కాళ్ళకు మాత్రం బంధం పడింది
అతను ఇంట్లోకి రాలేదు
తాను ఇల్లువిడిచి పోలేదు
లంకలో సీతలా వుంది తాను
అశోకవనం అన్ని ఇళ్ళల్లో వున్నదేను
తన వాళ్ళే తనకు రాక్షసులు
తాను ప్రేమించినవారికి శిక్షకులు
మోహిస్తున్న రెండు ఆత్మల మధ్య
గోడలు అడ్డువస్తాయనడం మిథ్య
పుచ్చపువ్వులా మళ్ళీ వెన్నెల విరిసింది
పిచ్చివాళ్ళ నిద్దరినీ కలిపేసింది!



ధాశరథి

# గ్రీష్మ కిరీటం

గ్రీష్మకిరీటం మెరిపిస్తూ
వూష్మం ఎగజిమ్ముతూ
రక్తాక్షి భయంకరంగావస్తే
రంభగా భావించి స్వాగత
కుంభాలతో ఎదురురమ్మంటున్నారు.

మంటలు వెంటపెట్టుకుని వచ్చే మధుమాసాన్ని
తుంట విలుకాని అమ్ములపొది అనుకోమంటారు
అరవిందాశోక చూత నవమల్లికలు
అరవిరిసిన నీరోత్పల మాలికలు
కలలతో అల్లి, ఈ లోకం
కంఠంలో వేయమంటారు.

మలమల మాడ్చేసే వేడిగాలిని, జనులారా
మలయానిలంగా భావించి ఆనందించండి !
వంటి నిండా చెమటను చందనం అనుకుని
వసంతాన్ని వూహించుకుని తృప్తిపడండి

యెండిన మ్రోడైనా కనిపించని
బండల నగరాల్లో కూర్చుని
అమ్రీ మంజుల మంజరిని గురించీ
కమ్రకంఠాల కోయిలలను గురించీ

కవిత్వాలు వ్రాయండి! రండి!
కావ్యగానాలు చేయండి ! లెండి!

పండగనాడు మామిడాకు దొరుకుతుందా ?
పసందైన వేపపూత లభిస్తుందా ?
మార్కెట్లో కొనండి వేపప్రసాదం
మనిషికి డబ్బుంటే పండుగ ప్రమోదం

ధనస్వామ్య సమాజంలో ధనం వున్నవాడే ఘనుడు
జనస్వామ్యాన్ని స్మరించుకుంటూ బ్రతికినవాడే పౌరుడు
డబ్బు రోడ్డురోలర్ కింద మనని
రుబ్బేసింది కరకు కాలం

గుండె పగిలిపోయిన సామాన్యమానవుడు
అండకోసం ఆకాశంవైపు చూస్తున్నాడు
ఆకాశం అగ్నిస్తంభం
అనలంకురిసే సూర్యబింబం
సమతలేదు, సమతలంలేదు
అసమతా హాలాహలం కలదు
హాలాహలాన్ని అమృతం అనుకోండి
పండగనాడు పానకం అనుకుని పానంచేయండి

మండించినా యెండించినా
మనదేగా ఉగాది ?
నిండుగుండెతో స్వాగతం చెప్పక
యెందుకు వేరేసోది ?
యెగరేయండి యెండల జెండాలు దండిగా
చిగురాకుల ఉగాదితో చేయికలుపండి నిండుగా.

# మృత్తికా గంధం

యెండ కాలంలో దండిగా కొట్టిన వాన
గుండెల్లో కురిసిన అమృతపు సోన

కాలిన నేలమీద నవ వర్షబిందు
జాలం రాలుతున్నప్పటి సౌరభం ముందు
పనికిరావు పరదేశీ అత్తరులు
అవి కంపుగొట్టే గాడిద గత్తరలు

అత్తరు అమ్ముతున్నాడు వీధిలో అహమ్మదాలీ
కేవ్డా (మొగలి), ఖస్ (వట్టివేరు) చంబేలీ (మల్లె)

మదనకదనంలో అలసిన మగువ స్వేదం
మల్లె అత్తరుకంటే మరింత ఆమోదం!

యెండలో వానలో కాయకష్టం చేస్తూ
కండలు కరిగిస్తున్నాడు కార్మికుడు;
గాయపడిన గుండెలతో కవీశ్వరుడు
గాండీవం లాంటి కలం చేపడుతున్నాడు

గ్రీష్మంలో కురిసిన వాన జల్లు
కించిత్ సమయం తరువాత చెల్లు;
అయితేనేం ? ఆ మృత్తికా గంధం
అత్తరు గత్తరల కంటే యెంతో సుగంధం

# తేజశ్చేతన

గాఢాంధకార స్తంభాగ్రంతో
కాంతి కళిక
కర్కోటకులపై విరుచుకుపడే
క్రాంతి కాళిక

చీకట్లను నిందించి ప్రయోజనంలేదు
చీకటి లేనిదే చిరు దివ్వెకు విలువరాదు
నరకాసుర సంహారం చేసిన నాడే
హరిని పరమేశ్వరుడని పిలుస్తారు

అమావాస్య అంధకారంలో దివ్వె వెలిగించే
అంగన శృంగార హస్తం
కాంచన కంకణ నిక్వాణంతో
కనిపించడమే నాకు సమస్తం

అంధకార యవనిక చాటున
ఆలింగనాల అనుభూతుల మాటున
ఏదో అనిర్వచనీయమైన ఆనందం
ఏదో విడదీయరాని అనుబంధం

కురుల్లో సంపెంగ పువ్వుల గుమగుమలు
ఇరుల్లో ఏకాంతంలో జంటల గుసగుసలు
దీపావళి అనగానే అన్ని వైపులా యవ్వనం
దేదీప్యమాన తేజశ్చేతన్యం.



దాశరథి

# అహింసా సూత్రం

అశాంతి దావానలం అవనిని ఆవరించిన వేళ
రణ మారణ మేఘాలు ధరణిని జడిపిస్తున్న వేళ
వ్యత్యాసాలు, వైరాలు ప్రజలను భయభ్రాంతులను
చేస్తున్న వేళ
మనిషికే మనిషి శత్రువై మహాక్రౌర్యంగా వ్యవహరిస్తున్న వేళ
దయా దాక్షిణ్యాలు దశదిశలలో ఎక్కడా దొరకని వేళ
స్నేహ, సహవాసాలు లేక, లోకం ఛిన్నాభిన్నమైన వేళ
మహాత్ముని అహింసా ప్రబోధం
మహీ మండలానికి సుప్రభాతం;
ఒకనాడు మనదేశానికే పరిమితమైన
ఉజ్వలమైన మహాత్ముని తేజం
ఈ వేళ దేశ దేశాల ప్రజలకు
ఇంత నీడనిచ్చే దివ్యభూజం;
అంధకార బంధురలోకాన్ని "గాంధీక్షేత్రం"
అనురాగంతో బంధించే అహింసా సూత్రం.

# ఓసీ మూసీ

కంపుకొట్టే మూసీ నదిమీద
ఇంపైన కవిత వ్రాయడం ఎలా ?
శ్మశానాలు, చాకిరేవులు
బూదికుప్పలు, భ్రూణహత్యలు
విట, విటీ జనావళి
విహార సంకేత నికేతనాలు
అధికార బలంతో ఆక్రమించుకున్న
అక్రమ వ్యవసాయ క్షేత్రాలు
బందిపోట్లూ, దొంగలూ, భేకీక
భటులతో కుమ్మక్కై
దోచుకున్న ధన కనకాలను
పంచుకునే రహస్య సీమలు
గంజాయి దమ్ముగాళ్ళ కైలాస శిఖరాలు
మురికికి ఆటపట్టు
మూసీ నది లోతట్టు !

ధారాపాతంగా కొన్ని
వారాలపాటు వర్షం దంచితేగానీ
పది రోజుల పాటైనా
నదిలోని దుర్గంధం పోదు

రోగులున్న ఉస్మానియా దవాఖానామీద
రోజూ రాత్రి కోట్ల దోమల దండయాత్ర
కొత్త రోగాలను తెచ్చిపెట్టే
ఘోర దుర్వ్యసనామయ విషపాత్ర

పాత కొత్త బస్తీల మధ్య
రోతగా తయారైన
మురికికూపంలాంటి "మూసీ" నదిని
పూర్తిగా క్షాళనం చేస్తే బాగుండును
లండన్‌లోని థేమ్స్ నదివలె
వాషింగ్టన్‌లోని పొటామిక్ రివర్ వలె
వియన్నాలోని వీథికుల్యలవలె
పరిశుద్ధంగా 'మూసీ' ఎప్పుడు ప్రవహించవలె ?

రమణీయంగా ప్రవహించే జలధారల్లో
రాజహంసల్లాంటి అందాల పడవల్లో
చల్లని సాయంసంధ్యా సమయాల్లో
పిల్లలూ పెద్దలూ వాహ్యాళి జరిపే కాలాలు
రానున్న శతాబ్దంలోనైనా వస్తాయా ?
రమ్య "ముచికుందా" నదీతటాలు మురిపిస్తాయా ?

రుజాగ్రస్త దుర్వ్యవస్థ అంతరించాలి
ప్రజారంజక పట్టణ ప్రభుత అవతరించాలి
అప్పుడు ముచికుంద సుమగంధ అవుతుంది
అందులోని జలం మకరంద మవుతుంది.

# విశ్వవత్సరాది

విశ్వ వత్సరాది వేంచేసినది నేడు
రమ్య శీతకాల రాత్రివేళ
చర్చి గంటలన్ని చర్చించుకొనుచుండె
మనసు లెన్ని పెనగు కొనునో యనుచు !

మనసు మనసు పెనగికొనిన మంగళవేళ
తనువు తనువు పెనగికొనుట సబబు;
మనసు తనువు కలసి ప్రణయము పొంగారు
రమ్య పౌష్యమాస రాత్రులందు

మనసు ప్రేమమయము, తనువు కామమయము;
తనువు పంజరాన మనసు చిలుక;
చిలుకముక్కు వంటి చెలి అరుణాధర
బింబమున సుధలు స్రవించవలయు

అర్ధరాత్రి అర్థాలు, పదార్థాలు
యువకుల పనులందు సుండబోవు;
యువతలోన నవత, నవతలోన కవిత;
వత్సరాది రాత్రి ! ప్రణయధాత్రి !

అర్ధరాత్రివేళ ఆర్పిరి దీపాలు
జంటలన్ని చేసె కొంటె పనులు;
చుంబనమ్ములందు సంబరమున్నది
ఎంగిలింతలేదు అంగజునకు !

ఎనుబదిపయి అయిదీ రాత్రి భువి పేర
నిద్రమరచి ముద్దు ముద్రవైచె;
పానపాత్రచేత, ప్రణయ జీవనయాత్ర
విశ్వమానవులకు విజయయాత్ర.

# మార్తాండునికి మరణ దండన

కిరణాల కత్తి పోట్లకి
కింద పడిపోయి
మార్తాండునికి వ్యతిరేకంగా
మరణ వాఙ్మూలం ఇచ్చి చచ్చిన
అంధకారం శవాన్ని
బంధువులు – రాబందులు
మోసుకెళుతున్నారు.

రక్షక భటాధికారులు
రవి మీద కేసు నమోదు చేశారు
కళ్ళు మూసుకున్న అన్యాయపీఠం వారు
భూత ప్రేత పిశాచాల
దొంగ సాక్ష్యాలు ఆధారంగా
కర్మ సాక్షికి మరణదండన విధించారు
దండనని వెంటనే అమలు జరపమని
ఖండితంగా ఆదేశించారు
పోలీసులు సూర్యుణ్ణి అరెస్టు చేయడానికి
పొద్దస్తమానం ప్రయత్నించి
అలసి నిద్రపోతున్నారు;
తెల్లవారేసరికి
నల్లగా మరో అంధకార శవం!

హంతకుడు మార్తాండుడు
ఆకాశంలో గంతులేస్తూ వెళుతున్నాడు
విశ్రుత విహారం చేస్తున్నాడు
విజృంభించి కిరణ ఖడ్గాలు విసిరేస్తున్నాడు
కైజారు దెబ్బలకు కంగారు పడిపోయి
రాజభటులు పలాయనం చిత్తగిస్తున్నారు
మార్తాండునికి వేసిన మరణ దండన
మరో కల్పాంతందాకా అమలు కాదు;
శిక్ష విధించిన వారు అప్పటికి అసలుండరు
శిక్ష అమలు జరిపేవారు ఈలోగానే పోతారు
మార్తాండుని శిక్షించేవాళ్ళని చూసి
మహీమండలం నవ్వుతోంది
మరణదండన పొందిన మార్తాండుడు
అంధకార రాక్షసుల్ని
హత్యచేస్తూ వెళిపోతున్నాడు
రక్కసులకు వత్తాసీ ఇచ్చే వ్యవస్థ
ముక్కలై పోవడం ఖాయం!

# కుసుమ కేతనం

ఎవరో నరుక్కుపోయిన మ్రోడు
ఈ వేళ ఉగాదినాడు చిగురిస్తున్నది;
జడము చైతన్యవంతమై
సంవత్సరాదినాడు మురిపిస్తున్నది.

ఛిన్నోపి
రోహతి తరుః

మ్రోడును మేడగా చేసుకుని
తోడులేని గరుత్మంతు డొకడు
ఆకాశంవైపు ఎగా దిగా చూస్తూ
అలా కూర్చుని ఉన్నాడు
మదనేక్షు ధనుర్వినిర్గతమైన
మృదు బాణవాళి కోటి కోటి
పువ్వులై మ్రోడుమీద వర్షించి
నవ్వుతున్నాయి గరుత్మంతుణ్ణి చూచి
ఊరికే చెట్లు నరికే వారు
ఒక్క మొక్కనైనా నాటలేరు
చేదు వేపను ఛేదిస్తారు
రసాల తరువును రంపాన కోస్తారు.

జ్వాలల్లా ప్రజ్వలిస్తూకూడా చుర్రుమనని
పాలాశ కుసుమారుణ వనవాటికలో

వసంతుడు ప్రవేశించడానికి ప్రయత్నిస్తే
వద్దని అడ్డుపడే వారుంటారు కొందరు.
ఎర్రగన్నేరు పూలతో అందగించు చోట
ఎర్రగా రుధిరం చిందరాదు ఈ పూట:
దురాశ దుష్ట హృదయాలలో
శిరీష కుసుమ సౌకుమార్యం వట్టిమాట.

శుకరథం మీద వస్తున్న వసంతుడికి
సుమపథం మీద వేంచేస్తున్న మదనుడికి
పూల జండాలతో స్వాగతం పలకాలి
ఈ లోకాన్ని నందనవనం చేయాలి.

గుండెలో పూలవానలు కురియువేళ
మండుటెండకు జంకెడు మనుజు డెవడు?
ఎండ రేయెండగా చేయ లెండు! రండు!
ఈ ఉగాది ఉత్సవ మధురోదయాన.

# జ్యోతి పలికించిన గీతి

నక్షత్రాలు నింపిన తట్ట నెత్తిన పెట్టుకుని
నడిచి వెళుతోంది అందాల జాబిలి
పూర్ణిమా కౌముదీ పథాలపైన;
పూర్ణ యవ్వనంతో పొంగిపోతోంది రాత్రి కన్య;
నగరంలో మహాసౌధాల నిర్మాణంలో
పగళ్ళూ రాత్రులూ పనిచేసిన స్త్రీపురుషులు-
రాళ్ళుకొట్టి జీవించేవాళ్ళు—రాత్రి తిరిగి వెళుతున్నారు
ప్రజాసమ్మర్దం లేని అడవి దారిలో గుంపుగా;
వాళ్ళలో ఆడవాళ్ళు అజంతా శిల్పాలు—
రాళ్ళలా కఠినమైన వారి వక్షోజాలు
రైకలకు నోచుకోలేదు, అవి సహజ రమణీయాలు!
చెమట పట్టిన వారి నీలశిలా శరీరాలమీద
చంద్రిక కురుస్తోంది బుద్ధమూర్తి కారుణ్యంలా;
నగ్నవక్షోజాల పూపుతో నడిచి వెళుతున్న
'నాగరికత' యెరుగని ఆ మగువల మీద
అకస్మాత్తుగా దాడి చేశారు పట్నం గూండాలు
అంతా, భయంతో, పెట్టారు వారికి దండాలు;
కండకావరంతో గూండాలు కత్తులు ఝళిపించారు
నిండు యవ్వనంతో నిగనిగలాడే కన్నెల్ని లాక్కెళ్ళారు

మానాపహరణ విద్యాప్రవీణులు గూండాలు
మగువల వలువల్ని వలిచేస్తున్నారు, నిర్దయులు!
కాంతల చేతులు ఖడ్గాలా?
కన్నెల కాళ్ళు గదా దండాలా?
మదన కదనానికి వచ్చిన లుచ్చాలు
మరణ వదనంలో ఇరుక్కున్నారు!

వారిని జడిపించి మగవారిని విడిపించి
మగువలు–కేళికకు ఒప్పుకోక–కాళికలయ్యారు
జాబిల్లి తన తట్టులోని నక్షత్రాలు పారబోసింది
జంకుతూ పశ్చిమ దిశగుహలోకి పారిపోయింది.

అవతరించాడు ప్రాగ్దిశలో జగజ్జ్యోతి
కవి రచించాడు వీర నారీమణుల విజయగీతి!

# ఐక్యభారతి

అత్యున్నత హిమాలయ శృంగాలు
అతి గంభీర భారత సాగర తరంగాలు
కలిసి ఎలా మాట్లాడుకుంటాయో తెలియదు
కాని, అన్నివేల మైళ్ళదూరం అడ్డురానేరాదు;
చలితో వణికించే హిమాచలం ఉత్తరాన
ఝంఝతో జడిపించే సాగరజలం దక్షిణాన
తూర్పున వంగసీమ
పశ్చిమాన ఘూర్జర భూమి
చతుర్దిశా విశాల సమగ్ర భారతం
సహస్ర వైవిధ్యాలమధ్య సమైక్య భారతం
భారత జననికి జయ! జయ!!
పావన ధరణికి జయ! జయ!!
కల్పాంతాలకైనా కలిసేవుంటాం మనం
అల్ప సమస్యలను అనల్పం కానివ్వదు జనం
మధ్యగామి కేంద్ర బిందువుదేశం
మధ్యాద్గామి సాంద్రసింధువు జనం
పల్లెల్లోవున్నాడు గాంధీజీ
పట్నాల్లో వుంటాడు పండిత్‌జీ
వాళ్ళకు మృత్యువేలేదు
వాళ్ళ అండ మనకు లేకుండాపోదు
కోట్ల నక్షత్రాల సాక్షిగా
కోట్ల వీరప్రజావళి రక్షగా

నా తల్లి భారతి ఇల్లు
నవనవోన్మేషముగా విలసిల్లు
ఐకమత్య శస్త్రాన్ని ఎక్కుపెడతాను
అనైక్య భావాన్ని మట్టుపెడతాను
భాషలూ వేషాలూ ఎన్నివున్నా
భారతదేశం మాత్రం ఒక్కటేనన్నా!
భక్తుల పూజా విధానాలు మారినా
ముక్తినొసగు మాతృ మందిరం మారునా?

# సూర్యచక్రం

రంగవల్లికలతో
ముంగిళ్లు—
పొట్టలనిండా వేడి
పొంగళ్ళు—
చల్లటి పగళ్ళు,
వెచ్చటి సెగళ్ళు,
వొళ్ళంతా పగుళ్ళు!
పెళ్ళికావలసిన
పిల్లల తండ్రి కెన్నో దిగుళ్ళు:
గొబ్బిళ్ళుకాదు సంక్రాంతి
పొంగళ్ళుకాదు సంక్రాంతి
సంక్రాంతి అంటే శాంతి
శాంతి లేని మానవులకు విభ్రాంతి.
సంక్రాంతిసూర్యుణ్ణి చంకన పెట్టుకుని
శ్యామల గగన కాంత మన
తలల మీది నుంచి వెళుతోంది
కొండంత కుండ—సూర్యుడు
ఆకాశంఅంగనవొడిలో ఒదిగి పోయాడు:
గగనాంగన వెలుతురు కళ్ళాపి చల్లింది
గగనాంగన ఇంటి ముంగిలే భూమి
భూమికి మానవుడే నేడు స్వామి

భూమిని మచ్చికచేసుకుంటేలేదు లేమి
వృక్షాలు నరికి భూమిని బాధిస్తున్నారు
వర్షాలు లేక మనుజులు తపిస్తున్నారు
గగనం మేఘాన్ని పంపదు
నదులనూ, చెరువులనూ నింపదు
మకరంలోకి సంక్రమించిన భానుడు
ఉత్తరం వైపునకు పయినిస్తున్నాడు
రేపు సూర్యకాంతే మనకు శరణ్యం
అందుకే వుండనివ్వండికాసింత అరణ్యం
హిమాంగనా గాఢాలింగనంలో
ఎంతో వెచ్చదనం వుంది
సూర్యకాంతి
ప్రసరించిన ప్రదేశాల్లో
యెంతో పచ్చదనం వుంది
సూర్యుడు సాక్షిగా
క్షుద్ర శక్తులను యెదిరించండి
రుద్రులై విజృంభించండి
సంక్రాంతి సంబరాల్లో
సప్తవర్ణాల అంబరాల్లో
చీకటి దొంగల్ని మరవకండి
దేశద్రోహుల్ని వదలకండి
సూర్యకిరణాల సంఖ్యలో
శూరాగ్రేసరులు,
దేశభక్తులున్నారు దేశంలో;
దేశాన్ని దాస్యంలో చిక్కనివ్వరు
సర్వస్వతంత్రంగా

వుంచుతారు త్యాగంతో
సూర్యచక్రం తిరుగుతున్నది
ఇంద్రాది లోక పాలకులు అయిదుగురు
నిషాదులగు మనుష్యులయిదుగురు
సూర్యరథం ఇరుసును మోస్తున్నారు
సలిలావృత సూర్యమండలంలో
సమస్త లోకాలు నివసిస్తున్నాయి
సూర్యచక్రంతో
వక్రబుద్ధుల్ని
నక్రపాయులైన దేశ శత్రువుల్ని
మకర సంక్రమణ
మంగళ వేళ ఛేదించాలి
అంధకార గుహల్ని
భేదించాలి
ఇది రైతుల పండుగ
ఇది కైతల పండుగ
ఇది దేశ ద్రోహుల్ని హతమార్చే
మేటి రౌతుల పండుగ
మకర సంక్రాంతి
మహీమండలానికి ప్రసాదించాలి శాంతి.

# మృగతృష్ణ

మండే యెండల్లో యెండమావులు,
యెండిన నాలుకల మూగ జీవులు
ఆత్మహత్య కొరకు వెళ్ళు అనాథలకు
ఆశ నిరాశ చేసే యెండిపోయిన బావులు
నగరాల్లో తరువులన్ని నరికిన వేళ
ఇళ్ళలో ప్రత్యక్షం ప్లాస్టిక్ పూవులు
దొరికిన పొడరు పాలతో తృప్తి పడాలి
కలలోనే మిగిలాయి గంగగోవులు
ఆకలి దప్పులు తీర్చే ఔషధాల కోసం
పరిశోధన జరపాలి వైద్య మేధావులు
ప్రభాత శుభ సమయంలో పత్రికలను విప్పితే
వార్తల్లో అయ్యయ్యో ? ఎన్ని చావులు ?
అన్నివైపుల సముద్రం; ఆదిలేదు అంతులేదు,
అన్వేషణ యెందుకండి ? అసలు లేవు రేవులు ?
"పానీ!, పానీ?" అంటూ పంపు వద్ద పోట్లాటలు,
దాహంతో ప్రాణాలు తప్పినవి రావులు
శరథీ? ఒకవైపేమో అన్నపురాశులు కాగా
మరోవైపు మాడుతున్న ఆకలి ప్రేవులు

# రుధిరబుధ

భారత ధరిత్రిపై రక్త వర్షం కురిసింది
భయంకర హింసా రాకసి నోరు తెరిచింది

అఖిల ప్రపంచ జనావళికి
అనురాగ మూర్తి నేల కూలింది
రుధిర బుధవారం—
జరిగి పోయింది ఘోరం

మాతృమూర్తిని హతమార్చిన
మానవరూప దానవులు
భారత దేశానికి తలవంపులు తెచ్చిన
పరమ నికృష్ట రావణులు

తల్లిని పొట్టన పెట్టుకున్నారు
పిల్లలను ఏడిపిస్తున్నారు
అహింసను కోరే జాతిని
హింసవైపు తోస్తున్నారు

అమర మాతృమూర్తికి మృతి లేదని
ఆచరించి చూపాలి
ఐకమత్యాన్ని సాధించాలి
అనైక్యమును హతమార్చాలి

అణువణువున వెలసిన తల్లి
అఖిల భారత ప్రజల కల్పవల్లి



దాశరథి

# ప్రభవ ! జయీభవ !

జీర్ణ పత్రాలను రాల్చేసిన కొమ్మ
స్వర్ణ కుసుమాలతో నేడు చక్కని బొమ్మ
షష్టిచక్రం సంపూర్ణ పరిభ్రమణం ముగిసింది
క్షయ గతించి ప్రభవ మరల ప్రభవించింది
    అనంత కాలాన్ని కత్తిరించే కత్తెర
    మన మనస్సులలో ఉన్న మాయతెర:
లేనిదాన్ని ఉందని భ్రమ పడడం
మానవుని విజ్ఞానానికి నిదర్శనం
    శూన్యంలోకి సైన్యాలు నడిపిస్తారు !
    శూన్యంలో ధాన్యాలు పండిస్తారు !
గెలిచామని సంతోషిస్తారు
ఓడిపోయామని చింతిస్తారు.
    వసంతాగమనంతో వనం ప్రసవిస్తుంది
    ప్రణయగానం చేస్తూ భ్రమరగణం పరిభ్రమిస్తుంది
కుసుమ హృదయంలోని మకరంద బిందువు
కూని రాగాల తుమ్మెదకు ఆనంద సింధువు
    కోయిల 'కో' అంటే ప్రాణం లేచి వస్తుంది
    తీయదనం—చేదు వేపలోనూ దీపిస్తుంది
మహారణ్య మధ్యంలో పలాశం పూస్తుంది
కుహనా లోకంవైపు కోపంతో చూస్తుంది
    నేనొక పలాశ పతాక చేత ధరించాను
    నేడు జరుగుతున్న మారణకాండను నిరసించాను

పలాశ కుసుమ వై జయంతి
ప్రజావళికి శాంతి జయంతి
మారుతున్న కాలాన్ని
మారకుండా ఆపదలచిన వారిని
కాలప్రవాహం తనలో లీనం చేసుకొని
కదలిపోతుంది
కాలాన్ని కదలకుండా ఆపేవా రెవ్వరు ?
కాలం బ్రహ్మస్వరూపమని తెలిసిన వారెందరు?
అఖండ బ్రహ్మాండ కటాహంలో
అమృతం నింపుతోంది వసంత కన్య
అశేష ప్రజలకు కాలశక్తి
అవగతం చేయగలిగితే ఆమె ధన్య
రండి ! శాంత, వసంత సైన్యాల్ని నడిపించండి !
అసాంత సైసిర శత్రువుని ఓడించండి !

# ధనుస్సు - మనస్సు

చంద్రుని వాయులీనం లోని
సాంద్ర చంద్రికా తంత్రికల మీద
ధనుస్సు ఆనించి లాగగానే
మనస్సు సంగీతాబ్ధిలో మునిగిపోదా?

గ్రీష్మ భీష్మాతపాన్ని మరపించే
గీతికా మేఘమాలికా వర్షం
ఆహా ! వాయులీన వాదకోత్తమా!
అందించు జనావళికి హర్షం

వాయులీన తంత్రిక
పసందైన "కమాను"
కలిసినప్పుడే గానం
కలవనప్పుడు మౌనం

మౌన మహారణ్యాలను ఛేదించి
మధుర గాన ఝరులు ప్రవహించి
హృదయ కేదారాలు ఫలించి
ఎదిగేలా చేస్తుంది ఆ విపంచి!
అతడు సంగీత విద్యా విరించి
ఆ సరస్వతి వచ్చింది అతన్ని వరించి!

గొంతెత్తి కోటి నక్షత్రాలను తాకినా
తంత్రి ప్రయోగించి దశ దిశలను ప్రతిధ్వనింపజేసినా
భూమ్యాకాశాల మధ్యభాగంలో
రమ్య గాంధర్వ వారధి నిర్మించినా

దివాంధులైన మదాంధులను
దివ్య గాంధర్వ లోకాలకు నడిపించినా
అంతా ఆ కళాదేవత అనుగ్రహం
ఆమె ఆదరం పొందిన వారిదే అదృష్టం.

# సౌజన్యకళిక

దివిలో నిసిలో
దినే దినే దివ్వెల పండుగ
భువిలో ఏటేటా
ఒక రోజే దీపాల పండుగ

తారా యుద్ధాలతో
గగనంలోని దివ్వెలను
ఆర్పేస్తారని భయం
అసలు లేదు నాకు

దేవతా గేహాంగణ జ్వలిత
దివ్య దీపాలు
అంతరంగంలో వెలిగే
అనురాగ దీపాలు
ఆర్పగల మారణాయుధాలు,
అఖండ బ్రహ్మాండంలో లేవు-రావు!

గాఢాంధకార మహారణ్య మధ్యంలో
కాంతి కళిక పరిమళిస్తున్నది
అమావాస్య తిమిర గిరి శిఖరం మీద
అంగన ఎత్తిన దీపిక ప్రకాశిస్తున్నది

తళతళలాడే కన్నులతో
గలగల లాడే గాజులతో
కలకల నవ్వుల జల్లులతో
నేలకు జారే పయ్యెదతో
పొంగులువారే వక్షముతో
స్నేహమయి తన బంగారు అంగుళులతో
ఎద గుడిలోని ప్రమిదలోని వత్తిని
ఎగదోసి జ్వాలను రేపే ప్రేయసి.

దౌర్జన్య పర్జన్య గర్జనలతో వచ్చిన
అశాంతి అంధకార నీడల్లో
సౌజన్య దీపిక వెలిగించిన సుకుమార హస్తం
శాంతి కాంతి కురిపించే నా అనుంగు నేస్తం!

ఆరిపోని దివ్వెలు
అనురాగపు నవ్వులు.

# తాజాగజల్

ఎడారులనే కోరుకున్న వేళ
ఇసుక తుఫానుకు భయపడనేల?

కంటక శయ్యను పరచుకున్నవాడు
వంటిపై గాయాలకు భయపడనేల?

చీకటి అరణ్యంలో చిక్కుకున్నవాడు
ఏకాకినైతినని దుఃఖపడనేల?

దానవుని దీన బాంధవు డనుకున్నవాడు
దగాపడితిమని నేడు తపనపడనేల?

ధన పిశాచమ్మును తలపైన పెట్టుకుని
మునిగిపోయితిమని కుమిలిపడనేల?

ప్రేయసి కఠినురాలు—ప్రేమించినావు
కరుణించలేదని కలతపడనేల?

కనరాని దైవము కనులలో వుండగా
కనిపించలేదని మదనపడనేల?

# చైత్ర రథికుడు

రమణీ తనువు
రసాల తరువు
వలుద వక్షోజములు
పక్వ ఫలరాజములు
యవ్వనమే వనం
నవ్వులే వసంతం
చెలి గళ కోకిలము
చేస్తుంది కలకలము
సుదతి వీక్షణములు
మదన శస్త్రాస్త్రములు
అధరాల నుండి చింది
సుధ రాలుతుంది
బంగారు బిందెల నుండి
పాలుకారిన లీల
ముదిత ఉరోజాల నుండి
ముత్యాల మాల
మదవతీ హృదయకుడుంగ ప్రాంగణంలోన
మదన కదన కుతూహల రాగాలాపన
    అంగన రూపము
    జంగమ దీపము

విప్లవ పతాక సదృశము
విరిసిన పలాశ కుసుమము

రెండు హృదయాలను బంధించే సూత్రము
మండుటెండల్తో దిగివచ్చిన చైత్రము
వసంతుడు వ్రాస్తున్నాడు ప్రణయినీ చిత్రము
మధుభాండమండితము పానశాలా సత్రము
సతతపాదయాత్రా పరాయణుడైన పథికుడు
శతసహస్ర కుసుమాలంకృత చైత్ర రథికుడు!

# గుల్ మొహర్

మళ్ళీ పూచిందండోయ్
మంగళకర హేమాంగిని
పీతాంబర సంశోభిని
ప్రియతమ తరువర భామిని

గుల్ మొహర్ నవ్విందండోయ్
కుసుమాలను రువ్విందండోయ్
నగరోద్యానం లోపల
నవ పతాక ఎగిరిందండోయ్

పచ్చని వృక్షాల నడుమ
వెచ్చని ఈ గుల్ మొహరు
సాధ్వీజన మధ్యంలో
సాలంకృత నవ వధువు

గుల్ మొహర్ పూచిందంటే
కొంటెగా చూచిందంటే
మనసులలో సుమాయుధుడు
మదనుడు చొరబడినట్లే !



దాశరథి

కాంచన సౌధం మాదిరి
కనిపించెను గుల్ మొహర్
వసంతు డెత్తిన పతాక
వలె తోచెను గుల్ మొహర్

అడవిలోన దవానలము
అంటుకున్న దనిపించును
గగనంలో హవనాగ్నులు
రగులుతున్న వనిపించును

ప్రణయాగ్ని జ్వాలలివి
వలచిన ప్రియ బాలలివి
ప్రకృతి నీలకచములలో
బంగరు సుమమాలలివి

నయనానంద కరమ్ములు
నరుల వేదనా హరములు
పంచబాణు డేయుచున్న
ప్రణవ బాణ పరంపరలు.

# పలాశ రక్తాక్షులు

ఈ రక్తాక్షి పలాశాలు
ఎవరు ఎగురవేసిన పతాకాలు?
ఇవి గ్రామీణ కామినులకు
ఎంతో విలువైన గులాబీలు
నల్లని సిగల్లో ఎర్రని మోదుగుపూలు
చల్లని ఆకాశంలో వెచ్చని ప్రభాతాలు
కాళిదాసు వర్ణించిన పలాశ కుసుమాలు
బాలేందు వక్రాలు, నఖక్షత మనోహరాలు
పట్నాల్లో కనిపించని పలాశాలు తీసుకుని
బహుదూరపు అడవుల్లో దిగుతుంది ఆమని
అందుకే ఉగాది అడవుల్లో బాగుంటుంది;
అరుణ పలాశసుమంపై నల్లని తుమ్మెద వాలుతుంది
మకరందం ఆరగించి మత్తెక్కి జుమ్మంటుంది
మానవుడు చేయలేని పని మధుపం చేస్తుంటుంది
భిల్లాంగన నల్లని కబరీ భరంలో చెక్కిన
విచ్చినపలాశ సుమావళి ఎంతో చక్కన
గులాబీలమీద లేని మోజు
పలాశములపై కలుగుతుంది ఈరోజు
"పలాశ కుసుమమ్ వృథా"—కాదు
పనికిరానిదేదీ సృష్టిలో లేదు
అడవిలో నిప్పంటుకున్నట్టులు
అగుపిస్తాయి మోదుగు పూమంటలు
పలాశ పతాక చేతగొని
వాలింది వనిలో ఆమని

# అగ్నిష్టోమం

అగ్గిపెట్టె అంత గుడిసెలో
అన్నం వండుతోంది
అగ్గిపుల్లంత కఱ్ఱపుల్ల
సిగ్గు పడుతూ పొగచూరుతోంది
అన్నం వుడికేనా?
సంక్రాంతి వేళ
ఆకలి ఆఱగేనా?
సంకురేతిరి సంబరాలను
చంకన పసివాడితో
తిలకిస్తున్న
వలువ కరువైన
వెలదికి
ఆకలి మీద
ఆలోచన లేదు.
చనుబాలుగా మారిన రుధిరాన్ని
చంటిపాప మధురంగా పీలుస్తోంది
కృశించిన శరీరంతో
నశించిన ఆశలతో
ఏకాకి ఆ ఇల్లాలు
ఏం పండుగ చేసుకుటుంది?

అనుభవించి నిసువును అందించి
అదే పోతగా వెళిపోయిన
ఆ మొగుణ్ణి శిక్షించరు
ఆమెను ఆకలి నుండి రక్షించరు

పేదల బాధలు బేరీజు వేసుకుంటూ
పెద్ద మేడల్లో నుంచి ప్రసంగిస్తున్నాడు
బానంత కడుపు నాయకమ్మన్యుడు
ప్రజలు అమాయకులు కనుక ధన్యుడు!
కళ్ళలో సంక్రాంతి జ్వాలలు
కడుపులో క్షుధాగ్ని కీలలు
దావాగ్నులై వ్యాపిస్తాయి-
దహిస్తాయి అన్యాయారణ్యాలు

సూర్యకిరణం కాగడాతో
చొచ్చుకుపోతా చీకటి గుహల్లోకి
గుహల్లో రత్నకంబళాలపై పవళించిన
కుహనా నేతృత్వాన్ని లాగుతా బయటికి

విక్రాంతి జ్వాలా మాలికల్తో
సంక్రాంతి అవతరించాలి
లోగిళ్ళు అందగించాలి
ఆకళ్ళు అంతరించాలి

ఇది అచైతన్య హిమధామం
ఇక చేతాం హేమంతాగ్నిష్టోమం
ఇది మహాప్రజా పరాక్రమ హోమం!

# గవేషణ

గవాక్షంలో నుంచి గదిలోకి
గంతువేసింది దౌర్జన్యం
కత్తిపోట్లకి తట్టుకోలేక
నెత్తురుకక్కి మరణించింది సౌజన్యం

పట్టపగలు నట్టనడివీథిలో
పట్టుపడకుండా వెళ్ళిపోయింది దౌర్జన్యం
సానుభూతిపరులు నిర్మించిన పాలరాతి
సమాధిలో పవ్వళించింది సౌజన్యం

దానవులు విజృంభించిన ధరామండలంలో
మానవులకోసం జరుగుతోంది అన్వేషణ!
యెడారిలో పుడిసెడు నీళ్ళకోసం
ఇసుకలో తైలధారకోసం గవేషణ!

# సూర్యావర్తం

ఆర్యావర్తం పుణ్యభూమి
సూర్యావర్తం ధన్యభూమి
సంక్రమణ చంక్రమణంతో
సంక్రమించిన తేజో రాసులతో
భారతీ పావన మందిర ద్వారాన
పలురంగుల రంగవల్లికలు దిద్దుతున్న
కన్యామణి కరకంకణ ధ్వనులు
కవీశ్వర కవనామృత ధునులు
హేమంత సీమంతనీ సీమంత సింధూరంతో
శ్రీమంతమైన సంక్రాంతి నాటి తెలుగు నేల
గోదావరీ కృష్ణవేణి తరంగ తురంగాల
ఖురసంఘట్టిత కేదారాల మాల
హర్ష పులకిత కర్షకావళి
అల్లదే! మ్రోగిస్తున్నది ఆనందకాహళి
కష్టాలు నష్టాలు భరించేది కర్షకుడే
కడుపు నిండా తిండి పెట్టేదీ కర్షకుడే
ప్రకృతి బాధించినా భరిస్తాడు
జగతి వేధించినా సహిస్తాడు
సంక్రాంతి మంగళ దినోత్సవం నాడు
జాతి జనుల ఆశలు తీర్చే భారం వహిస్తాడు
తెలుగుతల్లి వెచ్చని ఒడిలో మనం

చలి మరచి పవళించే పసిబాలలరి
ప్రాగ్దిశా సతీ ఫాల భాగాన
కోటి గోరంటల కుంకుమార్చన
మిత్ర వరుణాగ్నులకు నేత్రము
మింట సూర్య రూపము పవిత్రము
అఖిల ప్రాణులకు జీవాత్మ సూర్యుడు
సుఖ దుఃఖాల్లో మానవులకు మిత్రవర్యుడు
మకర సంక్రాంతి పురుషాకృతికి
మానవ శతకోటిమస్తకన్యస్తహస్త నమస్కృతి!

# తారకా ప్రహసనం

భగవంతుని కర్ణ రంధ్రాల్లోకి మాత్రమే
ప్రవేశించగలిగినంత మహోన్నత్యంలో
పాటలు పాడుతున్నాయి
తారకా గాయికలు
తరళకాంతి నాయికలు;

ఆకాశపు నీలి సరస్సులో
అవి నగ్న స్నానాలు చేస్తున్నాయి;
శుక మహర్షివంటి చంద్రుడు రాగా
ఒకింతైనా లజ్జ వహించకుండా
స్తన కందుకాలను ఎగరేస్తున్నాయి
ఘన జఘనాల దర్శనం ఇస్తున్నాయి
వ్యాసమహర్షి వంటి సూర్యుడు రాగా
వసనాలు ధరించి పారిపోతున్నాయి!

పగలు పరదాల్లో నివసిస్తున్నాయి
రేలు దిసమొలల్తో విహరిస్తున్నాయి
ఏమిటీ తారల వింత చేతలు?
ఎందు తరతమ ప్రవర్తనలు?
భువిలోని మానవాళికి అవి
మూగవిగా అనిపిస్తున్నాయి.... ....



దాశరథి

దివిలో దివ్య సంగీతం పాడుతూ
గగనంలో సొగసైన తారలు
కట్టుకుంటున్నాయి వెన్నెల చీరలు
చంద్రికా శ్వేతాంబరాలు నేసే
చందమామ చేనేత కార్మికుడు:
ధనం ఆశించకుండా తారలకు చీరలు
దానం చేసే అత్యంత ధార్మికుడు
తారలు విడిచేసిన చీరలు
బారులు తీరిన శ్వేత పయోధర మాలలు
వాన చినుకులు లేని తెల్ల మబ్బులు
వాడేసిన సుసరభేత్ సబ్బులు
వర్షా నీలవలాహకాలు రావాలి
వసుంధర హర్షంతో నిండిపోవాలి.

# నేత్రపర్వం

కొలుకి ముల్లు నాటితే
కరిగి పోతుంది కన్ను
హృదయం ఉద్విగ్నమైనప్పుడూ
సొద కుందుతుంది కన్ను
నయన సింహాసనం మీది అశ్రుబిందువు
నరలోకం పాలిటి కరుణా సింధువు
స్వాతిలో నీటి బొట్టు ముత్యం,
ఆ ముత్యంకన్నా అశ్రువు బిందువు అమూల్యం
ఇది సత్యం.
కన్నుల్లో వున్నై అనేక కాంతి లోకాలు
కన్నుల్లో ప్రతిఫలిస్తాయి అనంత శోకాలు;
చేపల్లాంటి నేత్రాల్ని చెడగొట్టవద్దు
పద్మాల్లాంటి నయనాల్ని పాడు చేయవద్దు
కన్నుని ఎప్పుడూ దురపయోగం చేయొద్దు
కన్నె పిల్లలకు కన్నుకొట్టి తన్నులు తినొద్దు!
ఇతరుల జేబుల మీద కన్ను వేయరాదు
నడుస్తూ ఎప్పుడూ నయనాలు మూయరాదు
'గన్ను' చేయలేని పని
కన్ను చేస్తుంది
గుండెలోకి దూరిపోయి
గుబ గుబ లాడిస్తుంది

కంటిలో మదనుడు చెరకు
వింటితో కూర్చున్నాడు-
కోణాల నుంచి పంచపంచ
బాణాలు వేస్తున్నాడు
నయన శయనాగారంలో
నవ్వుతున్నాయి స్వప్నాలు:
విలువ కట్టరాని రత్నాలు
వెలిగే రెండు నేత్రాలు
సమాజం శరీరమైతే
సత్కవి-కన్ను;
తనువు ఎక్కడ వేదన పడినా
చినుకులు కురుస్తుంది కన్ను.

# పద్యపంచకం

తిరుమల సత్కవి తోడుత
తిరుమల కేతెంచినాడ తిరుమలనాథున్
దరిశించు కొనుట పుణ్యము
పురుషార్థము కృష్ణమూర్తి పుట్టిన వేళన్.

స్వామి దర్శనంబు క్షణమైన యుగమైన
భేదమేమిలేదు వెలితిరాదు
కొండపైనగలడు గుండెలోనున్నాడు
లేదటన్నవాని తోడు గలడు.

సప్తాచలపతి యెల్లరి
కాప్తుడు, వద్దన్నగూడ అన్ని మొసంగున్
దీప్తిగల స్వామి మూర్తిని
గుప్తంబైయుండె భానుకోటిచ్ఛటలున్.

బాలాజీ సన్నిధిలో
కాలము గడుపుటను మించి కలవే సుఖముల్
శైలమ్మంతట గ్రుమ్మరి
లీలగ జీవితము గడప లేనైతిగదా.

స్వర్గం బెచటనొ గలదని
దుర్గమ మార్గముల గూర్చి తోచినవెల్లన్
నిర్గంధ కుసుమ రాశుల
దుర్గతి మనతలల చల్లుదురు వేదాంతుల్.



దాశరథి

# పూజా పంచకము

ఓహో! వేంకటశాస్త్రి సత్కవి కవిత్వోద్యాన వన్యాంగణ
శ్రీ హాసన్నవ పారిజాత కుసుమ శ్రేణుల్ గుబాళించు నీ
ఊహా వీధికలన్ త్రిలింగ కపరాడ్ యూధంబు గుర్రాలపై
రాహుత్తుల్ బలె స్వారిచేసెగద ధారా రమ్య కావ్యాళితో!

మా తెలఁగాణ మంతయు రమారమి రెండు శతాబ్దముల్ తమః
ప్రేతము చేతిలో గడచె; వెచ్చని యెండయె కాయలే; దదే
దో తెరచాటునన్ గడచె; నుజ్జ్వల కాంతిఘటా కటాహముల్
పాతర వేసియుండె; తెలవారగ లేదుగదా శతాబ్దముల్,

నేడు, నవోదయ ప్రథమ నిర్మల భాను కరాగ్రమాల ల
గ్రాడును మా తెలుంగు కవిరాజుల మానస పద్మసీమ; నీ
తోడును నీడ యుండనెగదో! తెలగాణమునందు గూడ కా
వ్యోడుపతి ప్రకాండములు వ్యోమమునన్ జలతారు లయ్యెడిన్.

అగ్ని పుష్పాలు పూచి ఉద్విగ్నమాన
సముల చీకట్లు కాల్చి వెచ్చదన మొసగి
కవులకంఠాల శాంతిగీతి వెలయించె
నా తెలంగాణ కోటి రత్నాలవీణ.

కోటి గళాలతో పిలుచుకొన్నది నా తెలఁగాణ నిన్ను నీ
నోటఁదెలంగుభారతిని — నూత్నయుగ ప్రథమోదయాన ము
క్కోటి తెలుంగు లొక్కకడగూడ విశాల మహాంధ్రతా నుమ
స్ఫోటన మాచరింపుము యశోనిధి; చెళ్ళ పిళాన్వయాగ్రణీ!

# మహానటుడు

బృహదాకాశ శిరోజ బంధిత జటారేఖా శశాంక ప్రభా
ప్రహరద్దివ్య తరంగ గాంగ జల ధారా శీత మేఘోగళుం
డు; హిమాని గిరి రాజ రాజత భుజోల్లోలాధి వాసుండు; ని
గ్రహణాను గ్రహణ ప్రవీణుడు నిశారంభ ప్రభావేళలన్.

పశ్చిమాశావేదిపై పాదమానించి
నాట్య మారంభించినాడు శివుడు
వేధో ముఖద్వార వీధి పరిత్యక్త
యై వాణి వీణ కేలందె మీటె,
వామ పార్శ్వస్థ శివా మంగళాంగ క
మ్ములు హరిద్రాకాంతి చిలుకుచుండె
దక్షిణామూర్తి నేత్ర స్ఫార వహ్ని ఫా
లమున శ్రీ చూర్ణపు పుండ్రమును దిద్దె

దిక్కులన్నియు ముక్కలు ముక్కలైన
రీతి ఢక్కను కొట్టె; డాచేత శూల
మెత్తి మొత్తెను చండాలి మిత్తి తలను,
దాని తొత్తులు రోగాలు తల్లడిలగ.

జ్వర బాధా పరితప్త మామక మనశ్చంద్రక్షపా బింబమం
బర మంటుష్ణ పయోజ బాంధవుని రూపంబూనె; కైలాస సుం
దరగేహుండు నటించి అగగనె చిత్తైపోయి పర్వెత్తె నా
జ్వర పైశాచి, పినాక పాణి నిటల జ్వాలారుణాక్షిచ్ఛటన్.

# దివ్వె తలమీద దినకరుడు

కారెనుబోతు మీద
స్వారీచేస్తున్న
దిగంబర బాలుడిలా
దివ్వె తలమీద
దిన మెలతో
దినకరుడు,
అంధకార సింహాసనంమీద
ఆసీనమై
మీసాలు మెలిపెడుతున్న
అహంకార ప్రతిరూపం
ఆశ్వయుజ అమావాస్య;
యవ్వన ప్రాంగణంలో
అడుగు పెడుతున్న కన్య
పరికిణీ అంటుకుంటుందనే
భయం లేకుండా
విచ్చుకత్తుల్లాంటి
వక్షోజాలు వంచి
చిచ్చుబుడ్లు అంటిస్తున్నది;
అరోరా బొరియాలిస్
ఆవహించిన
ఉత్తర ధ్రువంలా
వుంది ఈ రాత్రి—
దిగివచ్చిన నక్షత్ర మండలం
దీపావళి ధాత్రి.

(దాశరథిగారి చివరి కవిత)